కదుపుకుంటే సిక్కు నేలలో ఇంకిపోతాయి. లేదా గచ్చు నేలైతే అంతటా వ్యాపిస్తాయి. ముత్యం మీద ప్రియుడికి పుష్పాలో దానికి చేతికి అందవు.

ఆవేదనాతిశయాన్ని చెప్పే మరో పద్యం :—

''శస్త్రవైద్యు కత్తిసాగెను రక్తాశ్రు
గణము లొలికె, నీవు కరుగ లేవొ!''

విరహంబాధవలన గుండెలో గాయమేర్పడింది. ఆ గాయాన్ని బాగు చేయడానికి శస్త్రచికిత్స జరిగింది. అప్పుడు కత్తిపోటం అతని గుండెగాయాన్ని చూచి సొంతకన్నీరు కార్చిందట! కాని ప్రియురాలు మాత్రం కనికరించలేదు. కత్తి గుండెను కోస్తున్నప్పుడు గుండెలోని రక్తం కత్తికి అంటడాన్ని కత్తి కన్నీటి కన్నీరు కార్చడంగా ఉత్ప్రేక్షించాడు గాలిబ్.

ఇట్టిదే మరో పద్యం :—

''నాదు గుండెగాయము కుట్టు సూదికంట
(రసు)జలధార దారమై అవతరించె''

హృదయగాయాన్ని కరగించే పద్యం ఇది. తన గుండెలో పెద్ద గాయం పడింది. గాయాన్ని కుట్టకపోతే ఇంకా పెద్దగా వ్యాప్యం పూరిస్తుంది. అయితే గుండె గాయాన్ని కుట్టే సూదిలో తన కన్నీరే దారమై అవతరించిందట.

ప్రియురాలి తిరస్కారభావంవలన ఏర్పడిన వేదన ఎంత భయంకరమైనదో చెబుతున్నాడు.

''వెలది! నీ ప్రణయాకృతి గొలుతునేని
ప్రళయభీభత్సమే ఒక నిముసపు చిన్న.''

ప్రణయాకృతిగ్నుతున ప్రియురాలి ప్రక్కన అనుభవిస్తే ప్రళయ భీభత్సాన్ని నిలబెట్టి కొలిస్తే ప్రళయం ఒక్క నిముషం తక్కువే వుండదట ఎక్కువో ఆమెకన్న. ఆమె వల్ల తనకు కలిగిన బాధ ప్రళయంవల్ల కలిగే బాధకన్న ఒక్క నిముషం ఎక్కువే అన్నమాట! విచిత్రమైన కల్పన!

ఆమె తనను పెట్టే హింస తగదని చెబుతున్నాడు :—

''ప్రేమభిక్షుకునిన్ హింసపెట్టు టరయ
ప్రణయ సౌందర్యరాజ్ఞికి పాడిగాదు.''

విశ్వగాడు, ఇచ్చి ఏడ్చినా అడుగుతే రాబట్టు కేవలం ఇస్తారు. విశ్వగాడ్జి

హింసపెట్టరు. ''నీవు సౌందర్యరాశివి. నేను ప్రేమ భిక్షుకుణ్ణి. నన్ను హింసించడం న్యాయంకాదు'' అంటున్నాడు.

తన ప్రేయసి సౌందర్యాన్ని చెబుతున్నాడు :—

''నీ వెలుగుచేత సూర్యుడు నింగి మెరయును
లేనిచో సూర్యు డొక బిచ్చగాని కరము.''

ప్రియురాలి కాంతివలన సూర్యుడు వెలుగుతున్నాడు. అంతేకాని అతనికి సహజమైన కాంతి లేదు. తన వెలుగును ఆమె సూర్యునికి ప్రసాదించకుంటే సూర్యుడు బిచ్చగాని చేయిలాగా రిక్తమైపోతాడట. అంత కాంతిమంతురాలు ఆమె.

తన విరహబాధను చెబుతున్నాడు :—

''మునుపు పువ్వులతోటలున్నచో మురిసిపోతి,
పూలవాసన నూపిరిపోవు నేడు''

ఇదివరకు పూలతోటలంటే ఎంతో మురిసిపోయేవాడట. కాని ఇప్పుడు పూల వాసన తగిలితే ఊపిరిపోయేట్టుంది. అనగా పూలవాసన ప్రేయసిని మాటిమాటికి తలపించి తన వేదనను మరింత పెంచి ప్రాణంపోగొట్టే పని చేస్తున్నది.

''ఆమె రానుందని వార్త యుండె నిన్నట,
నాకు నేడింట చాపైన లేకపోయె.''

ఇన్నాళ్లకు ఆమె తన ఇంటికి రానున్నట్టు వార్త తెలిసింది. ఆమెను కూర్చో పెడదామంటే చాపచింపైనా ఇంట్లో లేదు. ఆమెకోసం పిచ్చివాడై సర్వస్వం పోగొట్టుకున్నాడని భావం.

''మృత్యువే తెంచినపు డామె లేఖ వచ్చె
చదువకయె వక్షమున నుంచి చచ్చినాను.''

తీరా మృత్యువు సమీపించినప్పుడు—ఇన్నాళ్లకు—ఆమెవద్దనుంచి లేఖ వచ్చింది. చదివే శక్తి లేదు. వక్షంమీద పెట్టుకుని, చదవకుండానే, చనిపోయినాడు. వ్రాయక వ్రాయక ఇన్నాళ్ళకు వ్రాసింది ఆమె. ఆ లేఖలో ఏముందో చదువు కునే భాగ్యమైనా కలుగలేదు.

''దుఃఖవిషము నా ప్రాణాలు తోడివేసె
నీవు నను చంపితి వటంచు నింద లేల!''

దుఃఖంతో తాను చనిపోయినాడు. లోకమంతా, తనను చంపింది ఆమే, అని ఆమెను నిందిస్తున్నారు. "నిన్ను నిందించడం దేనికి? నన్ను చంపింది నీవు కాదే, పాపం! నా దుఃఖమే నన్ను చంపింది. లోకం నిన్ను నిందిస్తుందేమిటి?" అంటున్నాడు ప్రేయసితో. "నీ వల్లనే నేను దుఃఖపడి వచ్చినాను" అనే అర్థాన్ని ధ్వనిగా అందిస్తున్నాడు కవి. చక్కని వ్యంగ్యప్రధాన కవిత.

> "అన్ని బంధాల విదలించినట్టి యెడద
> కురుల ఉరులందునన్ చిక్కుకొనెను, చెలియ!"

అన్ని బంధాలను విదిలించుకున్న తన హృదయం, తన ప్రేయసి కురులనుండి మాత్రం తప్పించుకోలేక వాటిలో చిక్కుకొన్నదట!

ఇన్ని బాధలు అనుభవిస్తున్నా ప్రాణాన్ని వదలుకోలేడు:

> "జ్వాలయే దీపమునకు సర్వస్వమట్లు
> ప్రణయమే జీవితంపు సర్వస్వమయ్యె."

తనలో దగులారయనున్న వేదనను చెబుతున్నాడు:

> "నన్ను కవ్వించవలెను, నా కన్నులందు
> అశ్రునిర్ఝరంగ్రామరుత్ సమూహములు కలవు."

తన కన్నులలో కన్నీటితుఫాను లున్నవట!

> "వత్తువని మాట నిచ్చి నా వలపురాణి
> ఎదురుచూసెద, రాకపోయినను గాని"

వస్తానని మాట ఇచ్చింది. రాదని తనకు తెలుసు. అయినా ఎదురుచూస్తాడట. దానిలోనైనా కొంత తృప్తి లభిస్తుందేమో!

> "ప్రణయమున చావుబ్రతుకు, సర్వమ్ము నొకటె,
> ఎవరికై చావగలనో, జీవింతు నూహ"

ప్రణయంలో చావుబ్రతుకులు రెండూ ఒకటే. ఒకటి ప్రియమూ కాదు, ఒకటి అప్రియము కాదు. కాని నీ కోసం చనిపోగలను, నీ కోసం బ్రతుకగలను కూడా.

> "నీదు కనుచూపు కత్తిగానె యెడద
> చొచ్చినపుడు మిత్రమునోలె జూచికొందు"

ఆవిడ చూపు కత్తిలాగ గుండెలో గుచ్చుకున్నది. హృదయంలో ప్రవేశించిన వానిని మిత్రునిగానే చూడవలెను గనుక కత్తినైనా మిత్రునిగానే చూస్తుంటాను. నీ చూపు నా గుండెలో దిగి బాధిస్తున్నది. అయినా ఆ బాధను ఇష్టంగా స్వీకరిస్తాను.

ఇంచుమించు ఇలాంటి భావమే మరికొంత అందంగా ఈ క్రిందిపద్యంలో చెప్పినాడు గాలిబ్

''ఎడదలోనుండి వెడలిన, వెడలకున్న
క్రోలు నీబాణమునకీతాగ్రమ్మ ప్రియము''

ప్రియురాలు విడిచిన బాణం గుండెలో గుచ్చుకుంది. అయితే వెలికి తీయరాకుండా వుంది. తీయవచ్చినా, తీయరాకున్నా గుండెలో గ్రుచ్చుకున్న నీబాణం నాకు చాలా ప్రియమైనది అంటున్నాడు. బాణం మనగా ఆమె చూపే కావచ్చును, లేదా ఆమె వలపే కావచ్చును. బాధించేదే అయినా అది తన హృదయంలో గ్రుచ్చుకున్నది గనుక తనకు ఆ బాణపు వాడిమొనక్కు ప్రియమట!

''ఊహాలోనున్న ఆమెకై ఉబ్బిపోగా
మధువు సూహించి పాడెడి మధుపమట్లు.''

ఆమె ఇంకా తనకు లభింపనేలేదు. అప్పుడే ఆమెకోసం ఉబ్బిపోతున్నాడు. తేనె ఇంకా గ్రోలకుండానే కేవలం తలపుతో పాటపాడే మధుపంలా వుంది ప్రియుని పరిస్థితి.

నిజానికి, మధుపానం చేసినతరువాత ఆ నిండుమత్తులో మధుపం పాడలేకపోవచ్చు, అనుభవించినతరువాత మధువుపై ఆసక్తి తగ్గనూవచ్చు. కనుక మధువుకై ఆరాటపడుతున్నప్పటి మధురానుభూతి తరువాత కలుగదు. ప్రేయసిరాకకై నిరీక్షించడంలో కలిగే అనుభూతి ప్రియాసంయోగానంతరం తరువాత సన్నగిల్లడం సహజం. కోర్కెలు ఫలించకపోవడమే మేలేమో!

''వెతల కుందెడివాడు నవ్వీన వినాన,
పైన సంతోషమును, లోన బాధ నాకు''

తానెప్పుడైనా సంతోషంగా కనబడ్డా అది పైపై నవ్వే గాని లోనమాత్రం బాధే.

"బాధ భరియింపలేక బాష్పజల మోడ్చి
దాన తానమాడితి, పవిత్రతను గంటి"

గుండెలో బాధ తగ్గాలంటే కన్నీరు కార్చాలి. అప్పుడు గాని బరువు తగ్గినట్లౌతుంది. ఆ కన్నీళ్ళలో స్నానం చేస్తే పాపాలు ప్రక్షాళితమౌతాయి. పవిత్రత యేర్పడుతుంది.

"ఆననము చూపకుండిన మానెగాని
ముసుగు తీసి కుపిత నేత్రములనె చూపు"

నీ అందమైన ముఖాన్ని చూపడం ఇష్టం లేకపోతే, నీ కోప సంభరిత నేత్రాలనైనా చూపించు. ప్రసన్నవదనంతో కనపడకుంటే పోనీ. కోపంతో నావైపు చూచినా చాలు. ఆ కోపం తొణికిసలాడే కన్నులైనా ఆ ముసుగు తొలగించి చూపు!

"ఎంత దుష్టురాలవే! నిరాశాదేవి!
హృదయ రాత్రినె మురపించజాలు."

ఇక ఆమె లభించదనే నిరాశ బలంగా నాటుకుంటే ఆమెను క్రమంగా మరచగలుగుతాడు. కాని ఆమెను మరచడం ఇష్టంలేదు. మరపు కలిగించడానికి ప్రయత్నించే నిరాశాదేవిని నిందిస్తున్నాడు. ఆ ప్రేమ నిరాశ కలిగినా ఆమెను మరవడం ఇష్టంలేదు తనకు.

"ఆమె కోపన; నాకథ ఆసక్తదీర్ఘ,
నస్త్రి వినిపింప సందేశహారుడె జడిసెను."

నా సంగతేమో ఆమెకు కోపం. ఇక తన వేదనాకథ సుదీర్ఘం. అలాంటి కథను ఆమెకు వినిపించమని సందేశహారుణ్ణి పంపితే వాడికే భయం కలుగుతున్నది. ఆమె ఏమంటుందోనని అసలు వింటుందోనని అసలే తోచదు.

"కరుణ గలిగియు తన పూర్వసరణి దలచి
సిగ్గుతో తాను వెనుకకు తగ్గవచ్చు."

పూర్వం బహుకఠినంగా ప్రవర్తించింది ఆమె. కాని ప్రియుని దీనావస్థ చూచి కరుణ కలిగింది ఆమెకు. అయినా పూర్వం కఠినంగా ప్రవర్తించేది ఇప్పుడు మారితే లోకం ఏమనుకుంటుందో అని సిగ్గుపడి తన కారుణ్యాన్ని ప్రదర్శించడానికి వెనుకాడుతున్నది. కరుణ కలిగినా కాఠిన్యమే ప్రదర్శిస్తున్నదని భావం.

"దుఃఖవిష మింక గళమునే దూర లేదు
నరములన్ చేరినప్పు డెంత నరకమగునో!"

ఇంకా సరీగా గొంతులోకి చేరలేదు దుఃఖమనే విషం, అప్పుడే ఇంత బాధగా వుంది, ఇక అది డొక్కల్లోకి వెళ్లి జీర్ణించి రక్తంలో కలిసి రక్తనాళాలలో ప్రవహిస్తే ఎంత నరకంగా వుంటుందో?

"ఇంతి దారికి వచ్చెడిదేమొ తుదకు,
నీవు తొందర పడి మరణించినావు."

తనతో తానే అనుకొంటున్నాడు. నీవు బాధ భరించలేక తొందరపడి చని పోయినావుగాని బ్రతికేవుంటే మరికొన్నాళ్లకైనా ఆమె దారికి వచ్చి నిన్ను కనికరించేదేమో! ఎంత బాధనైనా మరికొన్నాళ్ళు బ్రతుకవలసివుండెది. ఆమె దారికివచ్చి నిన్ను ఆదరించేదేమో!

"ఇంత దుఃఖము సైప నా కేక హృదయ
మేల? ఒకపది ఇవ్వవైతేమి? దేవ!"

బాధ భరించవలసింది హృదయం. అయితే వున్నది ఒక్కటే హృదయము. బాధ చాలారెట్లు ఎక్కువైపోయింది. ఇంత బాధను భరించే శక్తి ఆ ఒక్క హృదయానికి లేదు. కనుక దైవమా! ఒక్క హృదయం ఎందుకిచ్చావు? ఏ పదిహృదయాలో ఇవ్వక పోయినావా? దుఃఖాన్ని భరించగలగడంలో అవి తోడ్పడేవి. దీన్ని పట్టి అతని వేదన ఎంతో అంచనా వేసుకోవచ్చు.

"నను వదలి పోగవలె నేగ నాడునీడ
గుండెలో అగ్గి గలవాని గోడు నేది?"

తాను సుఖపడి ఇతరులను సుఖపెట్టే వానికడ్డ ఎవరైనా ఉండడానికి ఇష్టపడతారు. కాని ఇతను గుండెలో అగ్గికలవాడు కనుక నీడకూడా ఇతన్ని విడిచి వెళ్ళిపోయింది. ఇప్పుడు మరీ ఒంటరివాడైనాడు. తనను నీడ వదలిపోవడాన్ని నిప్పులోనుంచి పొగ పైకిలేచిపోవుటతో ఉపమింపజేసినాడు. కడు చక్కని పోలిక.

"తరుణిదీర్ఘ కేశములు సౌందర్యఘనులు
వెలసినవి నేడు నన్నురి పెట్టుకొనుటకు."

ఆమె పొడవైన వెంట్రుకలు అందాలకు నిలయాలు. కాని అవి తనకు సౌఖ్యము నీయడానికి బదులు ఇప్పుడు ఉరి పోస్తున్నవి. అనగా ఆమె అనుగ్రహించు

అప్పుడు తాను ఆ కలలను ఆనందించగలదు గాని, ఇప్పుడు ఈ విరహసమయాన అవి మరీ బాధ పెడుతున్నవి.

> "కలలలో నామె నాస్థితి తెలియవచ్చు,
> కనుక ప్రత్యక్షముగ నడుగంగరాదు."

తన పరిస్థితులు తెలుసుకోడానికి ఆమె కలలో వస్తుంది. ప్రత్యక్షంగా రాదు. కనుక ఆమె తనను యెందుకు బాధిస్తున్నదో అడగాలంటే కలలోనే అడగాలి. ప్రత్యక్షంగా అడగడానికి వీలులేదు. ఎందుకనగా ఆమె ప్రత్యక్షంగా రానే రాదు. కలలో రావడం అనగా ఆమె తనవద్దకు రాకేరాదని అర్థం.

> "నా సమస్త మెరింగియున్నయటు లామె
> మోసగించు, నింకేమి చెప్పుదును నేను?"

అదృష్టవశాన ఎప్పుడైనా ఆమె కనపడితే నా కష్టసుఖాలు చెబుదామను కుంటాను. కాని చెప్పబోయేప్పటికి నా సమస్తం తనకు తెలిసినట్లు నటించి మోసగిస్తుంది. ఇక నేనేమి చెప్పేది? చెప్పే అవకాశం వచ్చినప్పుడుకూడా నన్ను తాను చెప్పనీయదు.

> "ఆమె దారింబోవుచు నాదు క్షేమ మరయు,
> ఏమి చెప్పుదు దారిలో నింక నేను?"

ఎవ్వరూలేని ఏకాంతస్థలంలో కలిసి ఆమె నా క్షేమం అడిగితే నా దౌర్భాగ్యాన్నిగూర్చి, బాధలనుగూర్చి చెప్పుకుంటాను. కాని దారిలో పదిమందియుండగ "క్షేమమేనా" అని అడుగుతే 'ఆ' అని తలఊపవలసిందేగాని చెప్పుకోడానికి వీలుపడదుగదా! ఈ విధంగా నా బాధలను నేను చెప్పుకోడానికి వీలివ్వకుండా లాంఛనంగా "క్షేమమేనా" అని అడిగి "ఆ" అనిపించుకొని తెలివిగా బయటపడుతుంది దారిలో కలిసి.

> "నిండుసందుచూపు నే గోరి వేచితి,
> కాంతు వేమిటు అరకంట తుదకు?"

నిండుచూపు అనగా ప్రేమగలిగి, కనికరము గలిగి, అనుగ్రహించ సిద్ధపడిన ప్రియురాలి చూపు. అట్టిచూపును కోరి ఇంతకాలం వేచియుంటే తుదకు అర కంట చూసావేమే? అనగా నిండుచూపు కోరినవానికి అరకంటిచూపు చాలదు. చమత్కారము!

"మొరపెట్టుకోనట్లైతే స్వరతాళములు లేవు
కన్నీటిపాటలో గిరాయింపులు కనరావు"

దుఃఖం వెళ్ళబోసుకోడానికి స్వరాలు తాళాలు ఎందుకూ? కన్నీటిసొంపుకు గజలూ యతులూ ఎందుకు? హృదయంలోనుండి పొంగులెత్తి వచ్చే బాధకు నియమాలు నిబంధనలు లేవు.

"స్వప్నమందైనా తాను వచ్చి నన్నోదార్చి
శాంతపరచేసి చాలు నాకు,
కాని దుఃఖవహ్ని కాసంతైనా నిద్దుర
పట్టనీదు, స్వప్నమెట్లబ్బు?"

ఆమె నిజంగా రాకున్నా సరే. కలలోనైనా కనపడి ఓదార్చితే అంతటితో తృప్తిపడతాను. కాని కలలోకూడా నాకు ఆమె కనపడే భాగ్యంలేదు. ఎందుకనగా, దుఃఖంవల్ల రవ్వంతైనా నిద్రపట్టదు. నిద్రపట్టనిది కల ఎలా వస్తుంది? విచిత్రమైన కల్పన!

"చావనగోరెడు వానికి చావురాని
ఘోరదుర్గతి నిక చూచి తీరవలయు"

చావాలనుకొన్నవానికి చావురాకుంటే అంతకన్నా ఘోర మేముంటుంది?

"పీడవో, పిశాచమువో, దుర్విధివోగాని
నీవు నాదానవైతివేని అదె చాలు"

నీవల్ల నాకు చాలా కష్టాలు కలిగినవి. నీవు పీడవేఅయినా, పిశాచమువే అయినా, దుర్విధివే అయినా నీవు నాదానవైతే నాకు తృప్తి. బాధిస్తున్నావు గాని నా దానివి కాకుండా ఉన్నావు.

"తరుణిచేతి అంబు తగులునట్లుగ నిల్చి
గాయపడగ కోర్కె గలదు నాకు,
అంబు తగులజేసి అద్దాని గొనిపోయి
తరుణి కిత్తు మరల తాను వేయ"

ప్రియురాలి చేతి బాణపుదెబ్బ తినాలనే కోరిక ఉన్నది. ఆమెవల్ల సుఖం లభించకుంటే పోనీ కష్టమైనా కలిగితే దాన్ని అనుభవించి తృప్తిపడతాను. ఆమె బాణం ఎక్కుపెట్టగానే ఎదురుగా నిలుచుంటాను. బాగా

టున అది నా గుండెను తగులక గురితప్పిపోతే ఆ బాణాన్ని తిరిగి తెచ్చి ఆమెకే ఇచ్చి మళ్ళీ నా గుండెను గొట్టించుకుంటాను.

''కాళ్ళు బొబ్బలెత్తి కడు మెల్లగా సాగు
బాటసారి వోలె బరగినట్టి
తారకాగణమ్ము త్వరగా చరింపదు
ప్రణయదీర్ఘ మార్గ వర్తియగుచు''

ఆకాశంలో నక్షత్రాలు గబగబా నడుస్తున్నట్లు కనపడవు. మెల్లగా సాగుతుంటాయి. సుదీర్ఘమైన ప్రేమమార్గం ఎంతకూ ముగియని నడచినడచి కాళ్ళు బొబ్బలెత్తగా మెల్లగా నడుస్తున్నమాట చుక్కలు. అవి కాళ్లుబొబ్బలెత్తిన బాటసారిలా వున్నాయి.

''ఆమె జూడగ నా మొగము మందగించె,
రోగి భాగ్యయ్యె ననుకొనసాగె నామె''

కనపడక కనపడక కనపడిన ఆమెను చూడగానే చిరవిరహంతో గంగో కృశించిన నా ముఖంలో తాత్కాలికంగా కొంత కాంతి వచ్చింది. అది చూచి నా రోగం బాగుందనుకున్నదామె. నిజానికి ఆ జబ్బు అలాగే వుంది. ఆ నిజం ఆమెకు తెలిసివుంటే నా దగ్గర వుండి సేవ సపర్యలుచేసి, చికిత్స సాగించును. కాని ముఖంమీది క్షణకాలపు కాంతిని చూచి బాగైనాదని తాను వెళ్ళిపోయింది. పోగానే జబ్బు మళ్ళీ ముదిరింది.

''రాత్రినిర్గోష్ఠిలోన రాగిల్లిన జగంబు
తెల్లవారగానె నల్లబారె.''

రాత్రంతా ప్రేయసితోను, మధువుతోను లోకం రాగిల్లింది. కాని తెల్లవారే సరికి మధువు లేదు, వధువు లేదు. జగం నల్లబడిపోయింది. తెల్లవారి మళ్ళీ అదే వేదన.

''ప్రణయ బాధలెటులను గూర్చి పలుకవలెనో ?
పాదములనుండి తలదాక బాధ దొప్ప.''

మరేదైనా బాధ తే శరీరంలోని ఏదో ఒక భాగంలో వుంటుంది. ఈ ప్రణయ బాధ ఆపాదమస్తకం క్రమ్మివుంటుంది.

''పిచ్చివాడ నేను చచ్చిపోయినగూడ
నా సమాధిమీద దోసమునక

పిల్లవాండ్రు విసరివేసినా రెన్నెన్నొ
బండరాళ్లు పూలచెండులట్లు.''

ప్రియా విరహంతో పిచ్చెత్తినవాడిమీద పిల్లలు రాళ్ళు విసురుతారు. 'నామీద అలాగే రాళ్లు విసరవాళ్ళు. అయితే ఇతను లభించ్చిలో ఉన్నప్పుడు పిల్లలు మజ్నూమీదలాగే రాళ్లు వేసేవారు. కాని ఇతను చచ్చిపోయినతరువాత కూడా ఇతని గోరీమీద పిల్లలు రాళ్లు విసరుతున్నారు పూలవానగా. నిజానికి గోరీలమీద పూలు చల్లాలి, రాళ్లుకాదు. కాని ఇక్కడ ఇతని పిచ్చి ఎంత ముదిరిందంటే, పిల్లలు ఇతను బ్రతికివున్నప్పుడేకాక చనిపోయిన పిమ్మటకూడా రాళ్లు విసరటం మానుకోలేదు. అంత పిచ్చి పుట్టించింది ఇతనికి. ఇదంతా ప్రియురాలికోసం అనుభవించే కదా!

''నాకు విధి లేక మూగనై నానుగాని
తెలిసిచో నేను మాట్లాడలేని దేది ?''

వ్యథాభిన్నమైన హృదయం నిశ్శబ్దాన్ని అవలంబించింది. ఏమీ చెప్పటం నీ శక్తి లేదు. ఆమెను నిందించడం ఇష్టంలేదు. చెప్పకపోతేనిది బాధ ఎవరికీ తెలియదు. చెప్పుకుంటే రహస్యం బయటపడుతుంది. కనుక మూగిగా ఉండిపోయాను. అంతేగాని నేను మాట్లాడలేనిదేది?

''నన్ను గూర్చి వార్త నాకె అందనిచోట
నేను వాసముండినాను నేడు.''

తన వార్త తనకే అందనిచోట ఉన్నాడట. తన ఒంటరితనం, తన బాధ, తన దౌర్భాగ్యం ఎట్టిదో ఇంతకన్న ఎలా చెప్పగలరు ఎవ్వరైనా?

''ఏది యమునింటి అగ్గిలో ఇంత వేడి?
కనపడక కాల్చు నేదనాంగార మిట్టు.''

తన హృదయంలో దాగివుండి బయటికి కనరాకుండా కాల్చే వేదనాగ్నివలన కలిగే బాధ నరకంలోకూడా ఉండదు అనటానికి—కనపడక కాల్చు వేదనాంగారంలోని వేడి నరకంనిప్పులోకూడా లేదంటున్నాడు.

''నన్ను హత్యచేసి నాసమాధిని నీదు
వీధి గట్టబోకు ప్రియురాలాంగి !
నా సమాధిబట్టి నలుగురు నీయిల్లు
తెలిసికొనుట నోర్వంగలనా నేను ?''

నేనున్న వీధినుంచే పల్లకిలో ఆమె వెళుతున్నది. అయితే ఎలాగో గాలిబ్‌ను నన్ను తప్పించుకునిపోవాలని చూస్తున్నది. పల్లకీబరువువల్ల బోయీలు మూలుగులు మార్చుకుంటూ మనుషులంటే అంగుళ అనుమతించకుండా గాలిబా వెళ్ళిపోతున్నది.

> "వానరాత్రి నిన్ను వదలి యెట్లు పుత్తు?
> లెక్కబెట్ట నొక్క చుక్క లేదు."

విరహంలో ఆకాశంలోని చుక్కలను లెక్కపెడుతూ రాత్రులు ఒంటరిగా గడుపవలసి ఉంటుంది కాని మబ్బుపట్టిన రాత్రి ఒక చుక్కైనా కనపడదు. ఏమి లెక్కపెట్టను?

> "ఉన్న హృదయ మొకటె—నిన్ను చూడని బాధ,
> నిన్ను వినని బాధ యున్న రెండు."

హృదయమేమో ఒక్కటి. కాని బాధలు మట్టుకు రెండు. ఒకటి - నిన్ను చూడలేదన్న బాధ, రెండవది- నీవు మాట్లాడగా విను భాగ్యం కలుగ దాయెనే అన్న బాధ.

> "అలిగితిని నీపయిన్, ప్రియురాల! నేను,
> అదియు నా వెఱ్ఱిలో నొక అంగమగును."

నీమీద నేను అలిగినాను. నీవు నామీద అలుగుట న్యాయంగాని నేను నీమీద అలగడం ఏమిటి నాపిచ్చిగాక?

> "ఎవ్వరేని నాగాథ వచింప నామె
> వినును చక్కగా; ననుగూర్చి అన దొకింత."

ఎవరైనా నాగాథను ఆమెకు చదివితే వింటుందిగాని, నోరు విచ్చి అయ్యో! అని అనదు. విని ఊరుకుంటుంది. ఎంత కఠినురాలు!

> "గాలిబా! ఆమెతో చెప్పగలము నీదు
> వ్యథను గూర్చి, నీ గుండెవంత గూర్చి;
> కాని అంతమాత్రమున తా కనికరించి
> చేరవచ్చు నటన్నది చెప్పలేము."

"గాలిబ్! నీ బాధను మేము ఆమెకు చెప్పగలం గాని అంతమాత్రాన

ఆమె మనస్సు కరిగి నీ వద్దకు వస్తుందనేది మూర్ఖపు చెప్పలేను''. అనగా ఆమె అంత కఠినురాలన్నమాట.

''సౌభాగ్యమును గోర బంధువాను చనటయెవరు ?
లోకమెల్లను మురావనోఢుడను నేను.''

మధువు పుచ్చుకోవడం సుఖంకోసంకాదు. ఉన్న దుఃఖాన్ని మరచిపోవడానికి పుచ్చుకుంటున్నాను. ఈ దుఃఖభరితమైన లోకాన్ని మరువడానికి మధువు సేవిస్తున్నాను.

''కఠిన శిలవంటి హృదయము గలుగు దాన !
తల పగులగొట్టుకొనుటయే సలపులైన
నీ గృహంద్వార బంధ సన్నిష్ఠ శిలనె
తల పగులగొట్టుకొనియెడి తలపు లేల ?''

ఆమె కఠినశిలవంటి హృదయం కలది. కనుక తాను ఎంత బాధపడినా కనికరించదు. కాగా ఇక బాధ భరించలేక తల పగులగొట్టుకోవలసియే ఉన్నదయినచో ఆమె ఇంటిగుమ్మపు రాతితో తలపగులగొట్టుకోడం దేనికి? ఏ రాతితోనైనా కొట్టుకోవచ్చు. కాని ఆ రాతితోనే తల పగులగొట్టుకోవాలనే కోరిక కలుగుతున్నది. చచ్చినా ఆమె ఇంటిముందే చావాలి.

''నావలెనె దుర్దినములున్న వాడు లోకంగు
రేయినే పగలనుకున్న పోయెనేమి ?''

దుఃఖాలు క్రమ్మిన పగలునూ, దుఃఖాలున్న రోజునూ దుర్దినం అంటాం. దుర్దినం నాడు ఎవరైనా నావంటివాడు రాత్రిని పగలనుకుంటే తప్పేమిటి? అని అడుగుతున్నాడు. ఎందుకంటే, చీకట్లు క్రమ్మిన పగలు, రాత్రి ఒకటిగానే ఉన్నవి. కాగా పగలును రాత్రి అనుకున్నా, రాత్రినే పగలనుకున్నా ఒకటే. రెండూ, మేఘావృతమై అంధకారబంధురాలే. అయితే గాలిబ్‌లోని చమత్కారం చూడండి. ''పగలును రాత్రి అనుకోవడంలో ఏంపోయింది'' అనటానికి బదులు ''రాత్రిని పగలనుకుంటే ఏంపోయింది'' అని తలక్రిందులుగా పలికి చమత్కరిస్తున్నాడు.

''బ్రతికినన్ని నాళ్ళు వెతలు తప్పవుకదా !
మృతియె వెతలదీర్పు వేళ యందు''

దుఃఖాలను పోగొట్టే మంచిమందు మృత్యువొక్కటేనట !

''ఆమె తననుగూర్చి అతిగర్వపడుచుండును
తాన విలువఁబోడు తాను నన్ను,
నేను స్వాభిమాన నిరతుండ గావున
విలువకుండ పోను, కలియు టెట్లు?''

గర్వంగల ఆమె తనంత తాను నన్ను రమ్మనదు. స్వాభిమానం గల నేను పిలువనిదిపోను. ఇక మేమిద్దరం కలుసుకోవటం ఎలా?

''కత్తి చేతలేక కదనమ్ము జరిపెడి
ఇంతి కెవ్వ డసువు లీయకుండు?''

ఆమె ప్రియునితో యుద్ధం చేస్తుంది. కత్తిమాత్రం లేదు. కేవలం చూపులతోనో, హృదయంతోనో, తలపులతోనో యుద్ధం జరుపుతుంది. అలాంటి దానికి ప్రాణాలు అర్పించకుండా ఎవ డుండగలడు? అసలు ఎవరైనా ఆమెకు ఓడి తన ప్రాణాలు సమర్పిస్తాడు. నిజంగా కత్తిపట్టుకుని యుద్ధానికి వస్తే నాతో కత్తితో పోరాడి గెలువవచ్చు. కాని ఆమె కత్తిలేకుండా కదనం జరుపుతుంది!

''శోకమందు సుఖము శోకమ్ము కల వండ్రు
శోకమనసె ఇచ్చె నాకు బ్రహ్మ.''

లోకంలో సుఖాలు, దుఃఖాలు రెండూ ఉంటూ యుంటాయి గాని నాకు సుఖాలు ఎన్నడూ లభించలేదు. దుఃఖితమనస్సునే బ్రహ్మ నాకు ప్రసాదించినాడు.

''ప్రళయము ముంచెగాని తలప నద్ది వియోగ
రాత్రికన్న దుర్భరమ్ము గాదు.''

అంతా ప్రళయమంటే చాలా దుర్భరమైన దనుకుంటారు. అది నిజమే. ప్రళయం దుర్భరమే. కాని వియోగరాత్రికన్న దుర్భరంమాత్రం కాదు. అనగా వియోగరాత్రి ప్రళయంకన్న దుర్భరము అని.

''పరుల తీపి మాటలకు లోబడెను తాను,
నోరులేని నన్నా యమ చేరనీదు.''

తియ్యతియ్యని మాటలు చెప్పి దగా చేసేవాళ్ళకు లోబడిందిగాని, నిజంగా ప్రేమించినవాడంటి నోరులేనివాణ్ణి దగ్గరకు చేరనీయదు.

ఈ విధంగా ఉదాహరణలు చూపుతూపోతే ఎన్నైనా చూపవచ్చు. దీన్ని నేను స్వాదు వేదన అంటాను. విరహాతురమైన గాలిబ్ మనస్సు వెలు

సరించిన మాటలు ఎంత వేదనాభరితములో అంత స్వాదువులు. ప్రియురాలి పరిష్వంగంవలన కలిగిన ఆనందంకంటే ఆమె వియోగంవలన కలిగిన విషాదమే ఎక్కువ హృదయసంచాలకంగా వుంటుంది. కడు రమ్యమైన వేదన గాలిబ్‌ది. అతని శృంగారవర్ణన ఒకటే బాటది కాదు. గంభీరమైనది. ఉదాత్తమైనది. ఆయన బోధ మన భాషగా సంతరించి మనను గజలోలురను చేస్తుంది.

ఉరుదూలోను, ఫార్సీలోను తివళంటే పూర్వులు పోని ఈ మార్గాన్ని అనుసరించినాడు గాలిబ్. అతని వేదన పవిత్రమైనది.

గాలిబ్ గొప్ప మానవతావాది. అడుగడుగునా మానవత్వం అతని రచనలో తొణికిసలాడుతుంటుంది. యుగయుగాల శాశ్వతసత్యాలను అతడు దర్శించినాడు. లోకపు కష్టాన్ని తాను అనుభవించి దాని వలన కలిగిన అనుభూతిని ఎంతో చక్కగా అభివ్యక్తం చేస్తాడు.

> ''స్వయంలోపమ్ము తెలుసుకుంట పెద్దవిద్దె,
> లోప మెరిగినవాడె పూర్ణుడగు నరుడు.''

తా స్వభావాన్ని ఇంత చక్కగా తెల్పుకోవటం చాలా కష్టం. అన్నివిద్యలలోకీ పెద్దది తన లోపాలను తాను తెలిసికోవటం. లోపాలను తెలుసుకున్నవాడే పూర్ణుడట! లోపం లేనివాడు పూర్ణుడని సాధారణంగా తెలుస్తాడు. మహాకవి గాలిబ్ అలా చెప్పడు. అతనికి తెలుసు మానవుడు ఎంతవాడైనా లోపం లేకుండా వుండడు. అయితే లోపం తెలిసికోనివాడు గర్వింపడు. జాగ్రత్తగా మెలగుతాడు. వాడే పూర్ణుడు.

> ''ప్రతిది సులభమ్ముగా సాధ్యపడదు లెమ్ము
> నరుడు నరుడౌట యెంతో దుష్కరము సుమ్ము.''

ప్రతిపని సులభంగా జరుగుతుందనుకోవడం పొరపాటు. చిన్న-చిన్న పనులు ఎంతో కష్టంగాని జరుగవు. ఉదాహరణకు నరుడు నరుడవడమే ఉంది. అది చాలా చిన్నపని అనుకుంటాం. కాని అది అంత సులభసాధ్యమా? రెండు కాళ్ళు, రెండు చేతులు ఉన్నవాడల్లా నరుడేనా? దయామయుడు, గంభీరుడు, ఉత్తమగుణసమన్వితుడు, స్నేహశీలి, పరోపకారపరాయణుడు అయినవాడే నిజమైన నరుడు. ఈ గుణాలు ప్రతి నరునిలోనూ కానవస్తాయా? ఇవన్నీ కల వాడు కోటికొక్కడు. కనుక మానవుడు మానవుడు కావడం సులభసాధ్య మనుకోకండి. చాలా దుస్సాధ్యమైన విషయం అని బోధిస్తున్నాడు మహాకవి గాలిబ్ ఈ పద్యంలో

"వెతలపోద్రోలు మందేది, మృతియెగాక?
ఉదయమగుదాక దివ్వె వెల్గొందవలయు."

బహుజనాదరణపొందిన పద్యాలలో ఇదొకటి. జీవితంలోని దుఃఖాలను పోగొట్టే మందు మృతి ఒక్కటే. అది వచ్చేదాకా అన్నిరకాల దుఃఖాలను సహిస్తూ కాలం వెళ్ళబుచ్చాలి. ఎలాగంటే — తెల్లవారేదాకా రాత్రి పొంతం దీపం వెలిగితీరవలసిందే. ఒకసారి నిండుగా, ఒకసారి తగ్గి, ఒకసారి కొడిగట్టి, ఒకసారి గంగరంగులుగా వెలగాలి. జీవనయాత్ర మృతి వచ్చేదాకా సాగవలసిందేగదా!

"కానుపించుగాని గమ్యమ్ము చిక్కదు
నేను నడచినట్లు తాను నడచు."

ఎంత పరుగెత్తినా అందని గమ్యాన్ని గురించి ఇంత చక్కగా స్పష్టంగా చెప్పినవాడు కానరాడు. దూరాన గమ్యం కనిపిస్తున్నది. దాన్ని చేరాలని మనిషి నడుస్తున్నాడు. అతను ఏవేగంతో నడుస్తున్నాడో సరిగా అదే వేగంతో గమ్యం ముందు సాగిపోతున్నది. అతను ఎన్నాళ్లు ఎంత వేగంగా నడిచినా ఏంలాభం? గమ్యం అందే సూచన అగుపడదు. కనపడుతూనే వుంటుందికాని అందదు గమ్యం. అతను నడిచినట్లు అదీ నడుస్తూవుంటుంది.

"ఎంతో ఉత్సాహపడుచు కట్టించితి నగర!
మృతియె లేకున్న రుచి యేది బ్రతుకులోన?"

చనిపోతామనే భయం వుంటేనే బ్రతికివున్న ఈ నాలుగురోజులూ మనం కోరికలను తీర్చుకోడానికి కష్టించి పనిచేస్తాం. శ్రద్ధ తప్పి [illegible] అనుకొంటూ పోవచ్చు. చావు లేదంటే మనిషికి తొందరే ఉండదు, కృషీ ఉండదు. కనుక మృతివల్లనే బ్రతుకురుచి.

"ఈ జగత్తుస్వభావమ్ము నేమి యందు!
మంచిచేసినవానిని ముంచునోర!"

లోకస్వభావాన్ని ఎంతచక్కగా చెప్పినాడు! మంచిచేసినవాణ్ణే ముంచుతుంది ఈ లోకం. అమాయకులు బాధపడతారు. ధూర్తులు సుఖిస్తారు. మాయలలోకం ఇది. దీని స్వభావం విచిత్రమైనది.

"వేరులోనుండి కొమ్ములు విలసినట్లు
అన్ని కష్టాలు నిశ్శబ్దమందె పుట్టె."

శబ్దానికి విరుద్ధమైనది నిశ్శబ్దం. కాని నిశ్శబ్దంలో నుంచే శబ్దం పుట్టిందట! ఎలాగా అంటే భూమిలో కానరాకుండా వుండే వేళ్లలో నుండి వృక్షం మొలుచడినట్లు. ఎంత చక్కని ఉపమానం! మహాకవులైన కాళిదాసాదులు తప్ప అన్యులవలన ఈ ఉపమాన ప్రయోగం సాధ్యపడ దనుకుంటాను.

> "మా ద్వేలను స్పృహ్యావే కప్పిపుచ్చుకున్న
> అంబరము లెన్ని యున్న దిగంబరుడని."

తొడుక్కునిన దోసాలు గాని, తప్పులు గాని మాద్యులవలె వీర్పడి విరాగంగా వున్నాయా. వాటిని స్పృహ్యవు కప్పివుచ్చింది. అనగా చనిపోవుటవలన అవన్నీ కనరాకుండాపోయాయని. అంతే గాని ప్రతిరోజూ వుంటే ఆ వస్త్రము, ఆ మద్యలను, ఆ దోషాలను, పాపాలను దాచడానికి ఎన్ని అంబరాలు కట్టుకున్నా దాచలేడట. అవి నగ్నంగాపడి లోకానికి కనిపిస్తాయట. అంబరాలు ఎన్ని కట్టుకున్నా దిగంబరునిగానే మద్యులతో బయటపడతాడట తాను!

> "మల్లియు, గులాబి, చంపకవల్లి పూచె
> రంగు వేరయ్యును వసంతు రాక చెప్పె."

మల్లె తెలుపు, గులాబి ఎరుపు, చంపకం పచ్చరంగు. ఇలా ఈ మూడూ వేరు వేరు రంగులలో పూచినప్పటికీ వసంతం వస్తున్నాదనే వార్తనే తెలుపుతాయి. అనగా వసంతం ప్రవేశించినప్పుడు అన్ని రంగుల పూలూ పూస్తాయి. ఏ మతం వాడైనా భగవంతుని సాక్షాత్కారమార్గమే తెలుపుతాడు.

> "అన్ని రోగములకు నౌషధం బుండియు
> ప్రణయరోగమునకు కనము మందు."

ప్రణయరోగానికి మందు లేదని అందరికీ తెలుసు నిజమే గాని "లేదు" అని ఈరీతిని ఇంత చక్కగా చెప్పడం ఇతరుల తరంకాదు.

> "పిల్లలకు 'మతాబ'లు కాల్చుటెల్ల ఆట,
> అల్లి ప్రేమించుటయు నాట యగును మొదట,
> తుదిని భీమపరిణామ మొదవుగాదె!
> ఈ ప్రమాదపుటాట సృష్టించె నెవడొ!"

దీపావళి సందర్భంగా పిల్లలు మతాబాలు కాలుస్తారు. అది వాళ్లకు ఆటగా వుంటుంది. కాని పొరపాటున గుడ్డలకు గాని అంటుకుంటే బహుప్రమాదం. అలాగే ప్రేమించడం అంటే ఆటగా వుంటుంది మొదట. కాని తీరా

హృదయం ఒకదాని వరమై పోయి, అది లభించక, దానికై ఏడ్చి బాధపడి కృశించినప్పుడు తెలుస్తుంది ప్రణయం ఎంత ప్రళయకారిణియో !

"భిక్షుకునివంటి వేషము వేసి నేను
దాతలగువారి చేతలు చూతునోయి."

లోకంలో చాలామంది దాతలనిపించుకోవడానికి ప్రయత్నిస్తారు. నిజమైన దాత లెందరో, వహ్వా దాత లెందరో, వాళ్ళు ఏ యే విధంగా ప్రవర్తిస్తారో తెలుసుకోడానికి భిక్షుకవృత్తి నవలంబించాడట. ఒంటరిగా సర్వస్వ దీనుడైన బిచ్చగాడు కనబడితే దమ్మిడీ ఇవ్వని వారు, నలుగురు చూస్తుండగా ఒక ఆశాపరుని తన కరుణాగుణాన్ని వ్యక్తపరుచుకోడానికి ప్రయత్నించేవారు. పేరు ప్రతిష్ఠలకై పెద్దపనులు చేయాలనుకునే వారు చాలామంది ఉంటారు. ఎట్టి స్వార్థం లేక కేవల దయాబుద్ధితో ఇతరులకు సహాయం చేసేవారు కడు అరుదు.

"బ్రతుకుపై నింత విశ్వాసపడెద వేల ?
ఏడి మాంధాత ? పురుకుత్సు డేడి నేడు ?"

చక్రవర్తులే పోయినారు, మన మెంత, మన బ్రతుకు లెంత ? ఈ బ్రతుకుమీద విశ్వాసం పెట్టుకోకు అంటున్నాడు.

"మూగవడు నిష్ఠ తనువల్ల కీగళమ్ము,
కాన దుఃఖాశ్రుగీతమే కైన ప్రియము."

ఈ శరీర మను వీణ ఎప్పుడైనా మూగవడిపోతుంది. అనగా ఈ శరీరం నశిస్తుంది. కాగా ఈ బ్రతికిన నాలుగునాళ్లూ ఈ శరీరవీణ ఆనందగీతాలు ఆలాపించే భాగ్యాన్ని పొందడంకంటే, దుఃఖగీతాలైనా ఇష్టమే. ఎందుకంటే అసలు పలుకక నశించడంకంటే ఏదో గీతం పాడడం మంచిది కదా!

"బానిసనె యయ్యు స్వాతంత్ర్యపరుడ నేను,
తిరిగివత్తు కాశిని తల్పు తెరువకున్న."

కాశీ వెళ్ళినప్పుడు కూడా గౌరవంగా తలుపు తెరచి ఆహ్వానించితే తప్ప, అట్లా కాకుంటే తిరిగివస్తాడట. అంత స్వాతంత్ర్యపరుడు. ప్రియురాలికోసం తలపులూని, ఆమెకు బానిస అయిపోయినా ఆమె తనను తగురీతిగా గౌరవించి ఆహ్వానించకుంటే తిరిగి వస్తాడట!

"పడవ నెక్కింపవచ్చెదివా రెరుగరు
పడవలో మధ్య కలిగిన బాధ లెల్ల,"

"స్మృతి నెఱుంగని ఒంటిదేవతలకన్న
నలుగురికి మేలుచేసెడి నరుడె మిన్న."

దేవతలకు స్మృతి లేదు. వారు చేసేదీ, చేయవలసిందీ ఏమీ లేదు. వాళ్ళు తాము చూచుకొని ఒంటిగా కాలం గడుపుతారు. మానవులు నలుగురి మేలును కోరి పనిచేసి పరోపకారులౌతారు. కనుక నరులే నయం.

"చేసినట్టి పాపములకు శిక్ష యున్న
పాపములు చేయనందుకు వలయు రక్ష."

పాపాలు చేసే శిక్షిస్తారుగాని చేయని పాపాలకు ఏమైనా మెచ్చి రక్ష బహుమానం ఇవ్వరు. శిక్షించేవాళ్లు రక్షించాలి కూడా.

"'అస్తి' యని దగా చెందకు మయ్యా! నీవు,
వసుధపై నెంచిచూడ సర్వమ్ము 'నాస్తి'."

లోకంలో ఏదో వుందని దగాపడి దానికోసం తాపత్రయపడకు. లోకంలో అంతా 'నాస్తి'. ఎక్కడా ఏమీ లేదు. అంతా మాయామయం.

మహితకస్తూరికాపరిమళము జిమ్ము
సరస మధుధారకై గదా స్వర్గవాంఛ!"

స్వర్గాన్ని కోరి జపతపాలు చేసే వీరంతా కాంక్షేమిటి? కస్తూరీపరిమళం గుప్పుమని ఘుమఘుమలాడే మధువు కోసం గదా! ఆ వాంఛయే వీరిచేత ఈ జపతపాలు చేయిస్తున్నది. "స్వర్గంలో ఏమీ లేదు, అసలు స్వర్గమే లేదు" అనండి, నూటికి తొంభై తొమ్మండుగురు భక్తులు జపతపాలు మానుకుంటారు అంటాడు గాలిబ్. అందుకే ఒకచోట అన్నాడు—"ఈ స్వర్గాన్ని ఎవరైనా నరకంలో పారేస్తే బాగుండును. స్వర్గంమీది కాంక్షతో భగవత్ భజనలు చేసే చాలా మంది మానుకుంటారు" అని.

"స్వర్గమునుగూర్చి నాకు సర్వమ్ము తెలియు
మనసు సంతసపడుటకు మంచి ఊహ."

అసలు స్వర్గం లేనేలేదు. ఏదో మనస్సుకు సంతోషం కలగ దానికి ఇదో కల్పన, అంటున్నాడు.

"అందకత్తెల సాహచర్యమ్మునందు
కొద్దినాళులు గడపినగూడ చాలు.

ఘోరనిస్స్వర సంసార కుంపటమందు
కలకాలముగ మ్రగ్గి జీవించ జాలుకొంటి."

అంగారాల సాహచర్యం నాలుగు నాళ్ళైనా చాలునట! ఇటువంటి జంజాటంలో ఎన్నేండ్లు పడిఉండాలి? ఏం లాభం?

"సింధువునకు చేర బిందువు సింధువగును.
ధ్యేయమునుబట్టి ప్రతిపని ధన్యమగును."

నీటిబొట్టు నదిలో కలిస్తే నది అవుతుంది, వట్టి నీటి గుంటలోపడి వట్టి నీరౌతుంది, బావిలో కలిస్తే బావి అవుతుంది. అదే సముద్రంలో కలిస్తే చిన్న బిందువైనా సింధువౌతుంది. అలాగే ఉత్తమమైన ధ్యేయాన్ని కోరి చేసే పని ఈ లోకంలో ఘనకీర్తి సంపాదిస్తుంది. అధమ ధ్యేయమైతే అధమం అనిపించుకుంటుంది. ధ్యేయమే పనియొక్క ఔచిత్యాన్ని నిర్ణయిస్తుంది. వాస్తవం.

"చక్రవర్తి చేతి స్వర్ణపాత్రికకన్న
నాకు మట్టిచిప్ప నయముగా తోచు."

దుఃఖాన్ని కలిగించే పీకపుట్టినా, అది ఎంత విలువైనదైనా లాభంలేదు. దుఃఖాన్ని కలిగించనిది ఎంత సామాన్యమైనదైనా ఉపాదేయమే. చక్రవర్తి చేతిలోని స్వర్ణకలశం నానా దుఃఖాలకూ మూలం. దాన్ని దొంగిలించడానికి ఆశేపలు ప్రయత్నిస్తారు. దాన్ని భద్రపరచడం ప్రతిరోజూ ఒక సమస్య. దానికోసం ప్రతిక్షణం ఆరాటం. మట్టిచిప్ప అయితే దాన్ని బాధించేవా డుండడు. పోతే ఇంకొకటి సులభంగా దొరుకుతుంది. ఇలాంటి భావం కలదే మరో పద్యం వుంది గాలిబ్ ది. అది ఇది: —

"పగిలెనేని తెమ్ము పాత్రయొకం, కాని మేలు
మణికలశము కన్న మట్టిచిప్ప."

ఒకటి పగిలిపోతే ఇంకో మట్టిచిప్ప చప్పున తెచ్చుకోవచ్చు. మణికలశంవెంట అనేక బాధలు.

"కామకుండుకూడ ప్రేమమ్ము నటియించె.
ప్రేమకేమి కింక విలువలేదు

''మనిషి ఏకాకియైనను మనసులోన
గుంపులుగ భావములు చేరి గోష్ఠి జరుపు.''

మనిషి ఒంటరి అయినా వాని మనసులో అనేక భావాలు. పరిపరి విధాల ఆలోచనలు. అవి అన్నీ చేరి అనుక్షణం గోష్ఠి జరుపుతుంటాయి.

''వెతల నోర్చు మేని వెత లంతమగును,
సులభమగు నలభ్యములును గాన.''

కష్టాలు సహించగలిగితే అవి నాశనమైపోతాయి. అలభ్యాలు కూడా సులభంగా దొరుకుతాయి. సహించడం ఒక శక్తి కష్టాలను గెలిచే మార్గం. సహనంవల్ల అసాధ్యములు సుసాధ్యము లవుతాయి.

''వలపు లేనాటికేని నిష్ఫలము కాదు,
కాయ కాయని వృక్షమ్ము కాదు వలపు.''

ప్రస్తుతం నిష్ఫలంగా తోచినా ఏనాటికైనా వలపులు ఫలిస్తాయి. కాయలు కాయని వట్టి ఛాయాతరువులవంటిది కాదు వలపు.

''బిందు వణగారి సింధువై వెలసినట్లు
రుజయు పెంపొంది ఔషధరూప మందు.''

ఒక్క నీటిచుక్క కలిసిపోయి సముద్రమంత అవుతుంది. అలాగే వ్యాధి హెచ్చి తానే ఔషధం అవుతుంది. జబ్బుకు జబ్బే మందు కావడం అనగా మృతికలగడం.

ఎంత వేదన వెళ్ళబోసినా గాలిబ్ కొన్నికొన్ని తావుల మనసు నవ్విస్తాడు. నర్మహాస్యం ప్రయోగించిన పట్టులను పరిశీలింతాం.

''గుంజి దొంగిలించుకొనిపోయె హాయిగా
ముద్దొసంగ వెనుకముందు లాడు!''

ఎట్టి జంకూ గొంకూ లేకుండా నా హృదయాన్ని దొంగిలించుకొని వెళ్ళిపోయింది గాని ముద్దొసగుటకు వెనుకముందులాడుతుందేం!

''నేను మరణింప నాయింటిలోన మిగిలె
ప్రేయసుల చిత్తరువులును, లేఖ లంతె.''

ఇలను ఒదిలిపోగా ఇంటిలో మిగిలిన సంపద ఏమిటయ్యా అంటే — శ్రీయురాంగ్ర, ఫోటోలు, వాళ్ళు అవస్ రాసిన ప్రణయలేఖలు, అంతే.

> "వేరె పరదాల పగలు తారాగణమ్ము
> రాత్రి కేమియెవ్వని దిగంబరమ్ము లయ్యె."

నక్షత్రాలు ఆకాశంలో పగలు కనపడవు. రాత్రి కనపడతాయి. ఈ విషయాన్ని గాలిబ్ అపూర్వంగా చెప్పినాడు. గోషా స్త్రీలు పరదాలో ఉంటారు. నక్షత్రాలను గోషా స్త్రీలతో సరిపోల్చి పగటిపూట పరదాలలో దాక్కుని కనపడవు. రాత్రివేళ ఏమనిపించిందో ఏమో నగ్నంగా ప్రత్యక్షమైనాయి. పగలు అలా కనరానంతగా పరదాలలో దాక్కోవడం ఏమిటి? ఇప్పుడు రాత్రిపూట నిర్భయంగా నగ్నంగా సాక్షాత్కరించడంఏమిటి?

> "నీవు నేను గిట్టనియెడ, సాకీ! నాకు
> చషక మియకుము, దోసిట చాలు మధువు."

మధువు అందించు వారిని 'సాకీ' అంటారు ఫార్సీలో. నీకు నేనంటే ద్వేషము, కోపము, అప్రియము ఉంటే గౌరవంగా గిన్నెలో పోసి మధువు అందివ్వనక్కరలేదు మాకు. దోసిలిపడతాను, మధువు పోయి; అంటేచాలు. నాకు ఎట్టి అగౌరవం లేదు. కావాలసింది మధువు. అది దోసిలితో త్రాగినా చషకంతో త్రాగినా ఒకటే! పైగా నాకు చషకంలో కన్న, దోసిట పోయుము అనడంలో ఎక్కువ పుచ్చుకోవాలనే ఎత్తుకూడ గోచరిస్తుంది!

> "నా కొఱకు నీవు వత్తు వన్నయది నిజము,
> జాగుసేయు వటన్నది సత్య మగును,
> అసలు నావార్త నీ కందునంతలోన
> మట్టిలో నేను కలసెడి మాట నిజము."

నేను చాలా ప్రమాదస్థితిలో ఉన్నానని నీకు తెలిస్తే తప్పక నా వద్దకు వస్తావు. అది నిజం. ఏమాత్రం ఆలస్యం చేయవు. అదీ నిజమే. కాని అసలు అంతఃపురాలలో ఉన్న నీకు నా వార్త అందేలోగానే నేను చచ్చి మన్నైపోతాను.

> "గాలిబా! నీదు తాత్త్విక కలన, యహహా!
> తాగకుండిన నిను మేము యోగియనము!"

నిన్ను యోగిపుంగవుడని పిలిచేవాళ్ళుంటారు" అని. త్రాగడం తప్పుండా, వేదాంతాలు వల్లెవేసేవాడల్లా యోగి అని లోకం వుద్దేశ అభిప్రాయం. చాలా పవిత్రులుగా కనబడి బహుదుర్మార్గాలు చేసేవాళ్ళు, గుప్తంచిన కిలాడీలు ఎందరో ఈ లోకంలో వున్నారు. వాళ్ళకన్న తాగి ఎటువంటి అపకారం చేయని మంచివారు యోగులు కారా? అన్నారు. కాని, లోకం అంగీకరించదు. లోకానికి నటనే కావలసింది. అసలు హృదయపరిశీలన అక్కర్లేదు.

"నాకమందు నరకలోకమ్ము కలుపుకో
వలనదేలనోయి? భక్తపాల!
వాంఛ కలిగినపుడు వాహ్యాళి సేయగా
మరియు కొంత చోటు పెరుగుగాదె?"

నరకాన్ని స్వర్గంలో కలిపివేయకూడదయ్యా! దేవుడా! దానివల్ల కాస్త చోటు పెరిగి వైశాల్యం ఏర్పడి వాహ్యాళికి వీలవుతుందిగదా! అంటాడు కవి. స్వర్గనరకాలు రెండూ ఒకటే. విడివిడిగా ఉండవలసిన భాగ్యాలు కావు. పాపులు, పుణ్యులు అంతా కూడా దేవుని అనుగ్రహపాత్రులే. నరకం అంటూ లేనిది కాదు. స్వర్గనరకాలు కలగలసి ఉండడమే మేలు అంటున్నాడు.

"ఎవరి అధరచక్రిమును భావించినానొ
రేయి మదినెల్ల చుంబనశ్రేణి వెలసె."

ఏ సుందరి పెదవులను భావించినానోగాని రాత్రి మనసులో ముద్దులు గుంపులు గుంపులుగా కురిసినవట!

"ఆమె తోటకు వాహ్యాళి కరిగెనంట,
ఇంక తోటలో పూలు వాంఛించు నెవడు?"

అందకత్తెయైన ఆమె తోటకు వాహ్యాళికి వెళితే అంతా ఆమెనే కోరుతారు గాని పూల నెవరు కోరుతారు? పూలకంటే అందమైనది, సుకుమారి ఆమె.

"అందకత్తెలతో మాటలాడుకొఱకు
చిత్రలేఖనవిద్య నేర్చితిని నేను."

కళలపై గల మక్కువతో చిత్రలేఖనం నేర్వలేదు. చిత్రాలు గీయించుకోడానికి వచ్చే అందగత్తెలతో తనివితీరా మాట్లాడే కోరికతోనే చిత్రలేఖనవిద్యను అభ్యసించినాడట!

"పరుగులెత్తి సొమ్మసిల్లి పట్టుబడితి నేను
బందిపోటుదొంగ పరుగు లొత్తు."

ఒకసారి ప్రియురాలిని పట్టుకున్నాడు. అడవిప్రాంతం. దొంగ వెంటపడ్డాడు. దొరక కుండా తప్పించుకోవాలని చాలా పరిగెత్తాడు. తుదకు అలసట వచ్చింది. ఎంతో పరిగెత్తి పట్టుబడ్డాడు. ఎంతసేపో పరిగెత్తినందున ఇద్దరికీ కాళ్ళు నొప్పులున్నాయి. కాని దొంగను తాను పట్టుకోగలిగాడుగాని దొంగ కాళ్ళు తాను ఒత్త వలసివచ్చింది.

"సూరిని ప్రణతిలో తల వంచినట్లు గాన
భాగ్యరాశి ప్రముఖ్యము మధుభాండమునకు."

దేవుడికి మొక్కినట్లే మధుభాండానికి కూడా ప్రముఖ్యమంటాడు. సకలా భీష్టాలనిచ్చే దేవుడిలాగే సకల కష్టములను తొలగించు మధుభాండమునకు మొక్కవలెనని భావము.

"పగలు గోయుగా బడి, రాత్రి పట్టు నిద్ర,
నన్ను దోచిన దొంగకు సతొలెన్నవత్తు."

నెలులో డబ్బుంది. దాన్ని కాపాడుకోవడంలో రాత్రీ పగలూ జాగరతమవు తున్నాడు. నిద్రకేడ ఎన్నాళ్ళో అయింది. ఒక నాటి పట్టపగటిపూట దొంగ ఆ డబ్బును దోచేశాడు. పోయింది పోయింది. ఇక పోయేదేమీ లేదని హాయిగా నిద్రపోతాడు. చిరకాలంగా లేని నిండునిద్రను ప్రసాదించిన దోపిడీదొంగకు కృతజ్ఞతలు చేస్తున్నాడు.

"ఆమె ముద్దుచ్చుటకు సమ్మతించెనేమొ!
కాని ఇవ్వుమని అడుగగా లేను నేను."

అడిగితే బహుశః ఆమె మధురచుంబనం ప్రసాదించవచ్చు. కాని అడిగే దమ్ములు లేవు. అడుగనిదే ప్రసాదించదు ఆమె. కనుక పెద్దచిక్కులో పడ్డాడు.

"అప్సరసను బోని ఆమెనే వర్ణింప
శత్రువయ్యె నాదు మిత్రవరుడు."

ఆమె అప్సరసవలె కడు అందకత్తె. ఇక ఆమెయొక్క సౌందర్యాన్ని ఎంతో చక్కగా వర్ణించినవాణ్ణి నేను. కాగా ఆమెసౌందర్యాన్నిగురించి నా నోట విని మోహితుడైనాడు నా మిత్రుడు. ఆమె నా ప్రియురాలుగనుక తనను అభిలించడంలో నేను ఆటంకమని భావించి నాకు శత్రువై కూర్చున్నాడు

ఆమెయొక్క అతిలోకసౌందర్యం, అందులోనూ నేను వర్ణించనక్కరలేని మిత్రుణ్ణే నాకు శత్రువునిగా మార్చింది.

> "కరయుని శక్తి లేదు, కన్నుల బల మున్న
> దింక పానపాత్ర నెదుట నిడుము."

అతిగా త్రాగినాడు. పానపాత్రను చేతితో ఎత్తిపుచ్చుకునే శక్తిలేదు. అయినా ఇంకా పానపాత్రవైపు చూచే శక్తి మాత్రముంది. కనుక అక్కడే పానపాత్రను తీసుకుపోకు. నా కళ్లముందు ఉండనీ. త్రాగకపోయినా, చూచి ఆనందిస్తుంటాను అంటాడు.

> "పానశాల యెడ? భక్తుని ఇల్లెడ?
> నేను వెడలుచుండ తాను జొచ్చె."

పానశాలకూ భగవద్భక్తుని ఇంటికీ చాలాదూరం. కాని వాడు దొంగచాటుగా పానశాలకు వస్తూంటాడు. ఒకనాడు నేను పానశాలలోనుంచి బయటికి వెళ్ళుతున్నాను. అతను లోపలికి వొచ్చుతున్నాడు! ఇదీ మహాభక్తుల పని.

> "ఇతరులు త్వదీయచషకమ్ము నెంగిలింప
> పెదవులార నీవార్తకై ఎదురుచూతు."

ప్రియురాలా! నీవు అందిచ్చే మదిరాచషకాన్ని అన్యులు ఎంగిలించుతూ ఉండగా నీవు నన్ను రమ్మంటావనే వార్తకోసం నేను పెదవులారిపోగా ఎదురు చూస్తున్నాను.

> "స్వర్గమున తేనెధారల బడయగోరి
> వసుధపై మద్యపానము వదలె దేల?
> ఈగ లెన్నెన్నియో ఎంగిలించినట్టి
> తేనెగా దిది స్వచ్ఛమాధ్వీక మోయి!"

భూలోకంలో మద్యపానంవంటి పాపకార్యాలు చేయకుండా పవిత్రులుగా ఉన్న దైవభక్తులకు స్వర్గంలో తేనెధారలు లభిస్తాయని ఒక మతవాదం. గాలిబ్ అంటాడు— "స్వర్గంలో తేనె సాధించడంకోసం ఈ లోకంలోని మధువు వదులుకుంటావేమయ్యా! స్వర్గంలో తేనె ఈగల ఎంగిలికలిసి తయారైనది. భూలోకంలో లభించే మదిర స్వచ్ఛమైన ఇప్పపూలలోనుండి వెడలి నది. కాన ఆ ఈగల ఎంగిలికన్న ఇది మంచిది. దీన్నే అనుభవించు"—అని.

''ఎంతో కోమలాంగి ఇంతి, చేజిక్కెను,
చేత తాకినంతె చిదిమిపోవు.''

చిరకాలం వేచిన కోమలాంగి చిక్కింది ఇన్నాళ్లకు. కాని చేతితో తాకితే చిదిమిపోయేంత కోమలి. ఏం చేయను?

''గిన్నె నందించువారు లేకున్నయపుడు
కూజనే నోటి కానించుకొనుట మేలు.''

గిన్నెలో మధుపూరించి అందించే అందకత్తె ఉన్నప్పుడు ఆమె ఎంతకొద్దిగా ఇచ్చినా ఆ మొలకువలన మైకం హెచ్చుతుంది. ఇప్పుడు గిన్నె అందించేవారు లేరు గనుక కూజను ముఖానికి ఎత్తుకుని నోట కరచుకుని పుచ్చుకుంటే గాని చాలదు.

గాలిబ్ సౌఖ్య ఆశావాది. ఎంత వేదన ఉన్నా నిరాశపడి క్రుంగిపోడు. తనపై గట్టిన నమ్మకము కలవాడు.

''కాలమే నాదు గుండె నవళాని మిడిన
చేసినాపుడు నన్ను స్వప్న చిత్రములను,
మనసులో గల ఒక్కొక్క మచ్చ నాది
బీజమగు దివ్యదీపికావృక్షమునకు.''

తన హృదయంలోని మచ్చ దీపాలచెట్టుకు బీజంగా తోడ్పడుతుందట. ''దీపాల చెట్టు'' అన్న కల్పన తెలుగువారికి కొత్త. తన మనసులో పడిన గాయం మాని ఏర్పడిన మచ్చ కాంతివృక్షాలను తోరణ వెలయించే బీజం కాగలదని అంటున్నాడు కవి.

''ఈ ఎడారిముండ్ల కొసద ముక్కలు చెక్కి
పూలవోలె నిలుపజాలినాడ.''

ఎడారిలో అన్నీ ముండ్ల దుబ్బులుంటాయి. పూలుండవు. అయితే ఎడారిని పూలతో శోభింపచేయాలని సంకల్పం కవిది. దానికిగాను తన రక్తిలమైన హృదయాన్ని ముక్కముక్కలుగా కోసి ఆ ఎడారి ముండ్లకు వాటిని చెక్కి గులాబీపూలు మొలిచినవా అన్న భ్రాంతిని కలుగచేస్తానంటాడు, ఎడారును తోటలాగా మార్చడానికి గుండెను కోసి ఇస్తాడట!

"దుఃఖములు ధీరులకు సౌఖ్య ప్రదాయినిగ్గా,
వైద్యుతాగ్నితో శోకదీపంబు వెలుగు."

దుఃఖం ఉన్నమాట నిజమే. కాని ఆ దుఃఖంతో ధీరులు ప్రకాశిస్తారు. ప్రతిబింబాన్ని తొలగద్రోస్తారు. మేఘాల్లోని మెరుపుతో శోకదీపాన్ని వెలిగిస్తారు. అనగా శోకంలో కూడా ధైర్యంగా ఉంటారు వారు.

"లాగి విడిచిన బాణంబులాగు పడచు
పడతియెదలోన స్థాన మేర్పరచుకొనుమా."

మందకొడిగా వుండేది కాకుండా, లాగివిడిచిన బాణంలాగ వున్నట్లైతే పడతి హృదయంలో స్థానం ఏర్పరచుకో. ఎన్ని బాధలు వచ్చినాసరే నిరాశపడకు.

"హింస భరియించు శక్తి నార్జించె మనసు
ఇంక నాక్రూరురాలి వరింతు నేను."

ఆమె ఎంతహింసపెట్టినా ఇక నిరాశపడను. భరించే శక్తి మనసుకు కలిగింది. కనుక భయపడి వెనక్కిపోక ఆ క్రూరురాలిని వరించి సాధించి తీరుతాను.

"గుండియ వియోగవహ్నిలో మండిపోయె.
కాని సంయోగవాంఛను మానలేను."

వియోగాగ్నిలో గుండె మండిపోయినా నిరాశపడక సంయోగ వాంఛను వదలకున్నాను. కార్యదీక్షాపరులు వైఫల్యాలకు జడిసి వెనుదీయరు.

"జ్వాలయే దీపమునకు సర్వస్వమట్లు
ప్రణయమే జీవితంపు సర్వస్వమయ్యె.

* * * *

నన్ను కవ్వించబోకు, నా కన్నులందు
అశ్రుఝంఝామరుత్ సమావాహములు కలవు.

* * * *

మధువు గ్రోలి రాగిల్లిన వధువుమోము
చూడగోరె నా వెచ్చని చూపు లిపుడు.

దేవీ! నా తోటి బంధమ్ము త్రెంచబోకు,
ప్రేమ లేకున్న, ఉండనీ ద్వేషమేని.

* * * *

సాకీ! తివాసాటకి గిన్నెల మధువు పోసి
మధువునే బాధ పెట్టెదే విధ మిదేల?
దేవి! మధుపూర్ణ భాండమే తెచ్చి నాదు
నోటి కందీయరాదె! సంతోషపడెద.

* * * *

అశ్రుదళముల గలవు గాయాల పూలు,
వధ్యశిల కేగెదను హాసవదనమునను."

గాయాలను పూలుగాభావించి వధ్యశిలకు నవ్వు ముఖంతో వెళ్ళగలిగిన ధైర్యశాలితత్వాన్ని కవితలో ప్రదర్శించినాడు గాలిబ్. ఆతడు చాలా నవ్యుడు. ఎన్నడూ ప్రాచీన సిద్ధాంతాలకు కట్టుబడియుండలేదు.

గాలిబ్ రచనల్లోని, మరో విశేషం — ప్రతిపాఠకునికీ తన హృదయం గాలిబ్ రచనల్లో కనపడడం. మానవస్వభావంలోని వివిధరహస్యాలూ వీటిలో ద్యోతకమౌతాయి. గాలిబ్ వేదన ఆరోగ్యవంతుడైనవాని వేదన. వేదనా భరిత మైన ఆయన గేయాలలోని శబ్దాలు సాధారణార్థాన్ని దాటి విస్తృతార్థాన్నిస్తాయి. భావుకులైనవారికి బహుళార్థద్యోతకములైన గాలిబ్ పద్యాలు మరెంత హృద్యంగా వుంటాయి. సమర్థుడైన కవి వాడిన శబ్దం సాధారణార్థాన్ని మించిన అర్థాన్నిస్తుంది. కరెన్సీనోటు సాధారణమైన కాగితంలో చేయబడినదే. అయినా చిత్తుకాగితం కంటే ఎన్నోరెట్లు ఎక్కువవిలువ కలిగివుంటుంది. అలాగే గాలిబ్ వాడిన పదాలు గంభీరార్థాలను ఇస్తాయి. అసలు శబ్దాలకు అందని అవ్యక్తభావాలను గాలిబ్ వ్యక్తపరచినప్పుడు వాటిని హృదయంతో ఆస్వాదించవలసిందేగాని నిఘంటువుల సహాయంతో రుచిచూడలేం.

నిఘంటువులకు, నియమనిబంధనలకు అతీతమైన గాలిబ్ అమృతకవిత లోని అనన్యసామాన్యమైన వైభవం ఆయనజీవితంలో కూడా కనిపిస్తుంది.



# గాలిబ్ జీవితగాథ



గాలిబ్ పూర్తిపేరు మిర్జాఅసదుల్లాఖాన్ 'గాలిబ్'. 1797వ సంవత్సరం డిసెంబరు 27వ తేదీన 'ఆగ్రా'లో జన్మించినాడు. అతను టర్కీకి చెందిన ఐబక్ వంశీకుడు. వాళ్లల్లో తండ్రి ఆస్తి సంతతికి లభిస్తుంది గాని కొడుక్కి కాదు. కొడుక్కి తండ్రినుండి ఖడ్గం మాత్రమే వారసత్వంగా వస్తుంది. గాలిబ్‌ది మహావీరుల వంశం. గాలిబ్ తాత 'సమర్‌ఖండ్' నుండి షా ఆలం కాలంలో భారతదేశం వచ్చాడు. ఆయన పుట్టినిల్లు టర్కీ అయినా భారతదేశం రాగానే ఆయనకు ఒక జాగీరుకూడా దొరికింది. [illegible] ఏర్పాటుచేయించాడు రాజు. గాలిబ్ తండ్రిపేరు అబ్దుల్లాబేగ్ ఖాన్. గాలిబ్ తమ్ముని పేరు యూసుఫ్ ఖాన్. మహానుభావులైన వారిద్దరి బాల్యం [illegible] చెన్నాడుకాయి.

గాలిబ్ తండ్రి హైదరాబాదు సైన్యంలో కొంతకాలం పనిచేశాడు. ఆ తరువాత అల్వార్ సంస్థాన సైన్యంలో చేరిచేరకుండానే శత్రువులచేత చంపబడినాడు. అప్పటికి గాలిబ్ వయస్సు అయిదేళ్ళు. తరువాత నసరుల్లాబేగ్ చిన్నాయనకూడా చనిపోయాడు. తండ్రీ, చిన్నాయనా చనిపోయినతరువాత గాలిబ్‌కు ప్రభుత్వంవారు సంవత్సరానికి ఏడువందల రూపాయలు పెన్షన్‌గా ఇచ్చేవారు. 1857 ఏప్రిల్ 30వ తేదీదాకా ఈ డబ్బు దొరికింది. తరువాత ప్రథమస్వాతంత్ర్య సంగ్రామం (ఇంగ్లీషువారు దీన్ని 'సిపాయి తిరుగుబాటు' అన్నారు) సందర్భంగా ఈ సహాయం ఆగిపోయింది. మూడుసంవత్సరాలు చాలా కష్టపడ్డాడు గాలిబ్. దారిద్ర్యం దుర్భరమైంది. అప్పటి ఆయన దుర్భరస్థితి మీర్ మెహదీకి రాసిన లేఖలోని కొన్నిపంక్తులవల్ల తెలుస్తుంది. మహమ్మదీయులు "రమజాన్" నెలలో రోజూ పగలు ఉపవసిస్తారు. గాలిబ్ రాశాడు — "రమజాన్ నెలలో ఉపవాసాలు భోంచేస్తున్నాను. తినడానికి మరేదీ దొరక్కపోతే దుఃఖం పొందకుండా అనుభవించడానికి" అని.

